# రంగుల రాట్నం

బాలల గేయాలు



రెడ్డి రాఘవయ్య

RANGULA RATNAM (Nursery Rhymes for Children)

BY : REDDI RAGHAVAIAH



ప్రచురణ సంఖ్య 9

ప్రథమ ముద్రణ : 1993

ప్రతులు : 1000

వెల : రూ॥ 8/- లు

ముద్రణ :
మాధవి ప్రింటర్స్,
కుత్బిగూడ,
హైదరాబాదు-27.

కాపీలకు :
రెడ్డి రాఘవయ్య
శ్రీనాథ్ పబ్లికేషన్స్,
1-121, బాలానగర్,
హైదరాబాదు-5000 042.

AGE GROUP : 5 To 8 Years

## ఇందులో

చిట్టికవితలు, పొడుపువిడుపులు
ఆంధ్రభూమి (వారపత్రిక)లో
ప్రచురించబడ్డాయి....
ఆ సంపాదకులకు,

ముఖ చిత్రాన్ని
ముద్రించి ఇచ్చిన
"బాలాజీ ఆర్ట్ ప్రింటర్స్" అధినేత
శ్రీ బాలాప్రసాద్‌కు

పుస్తకాన్ని చక్కగా కంపోజ్ చేసి
అందంగా ముద్రించిన
"మాధవి ప్రింటర్స్" అధినేత
శ్రీ ఊట్ల గణేశ్ బాబుకు

**కృతజ్ఞతలు**

## ఇందులో

# మేలు కొలుపు ...

చుక్కలన్ని పోవునటుల
చక్కనైన వెలుగు వచ్చి
ప్రొద్దుపొడిచె నదిగో
ముద్దు తండ్రిలేవర ॥

పళ్ళుతోమి మొఖము కడిగి
తెల్ల బట్ట లేసు కొనీ
చద్ది అన్నమ్మును తినియు
బుద్ధిగాను బడికి పోవ;

ప్రొద్దుపొడిచెనదిగో
ముద్దు తండ్రిలేవర॥

భరతమాత గొప్పతనపు
చరిత నంత పాట పాడి
పెద్దలకును వందనమ్ము
శ్రద్ధ గాను నీవుచేయ

ప్రొద్దుపొడిచెనదిగో
ముద్దు తండ్రిలేవర॥

చెప్పునట్టి పాఠాలను
తప్పులేమి లేకుండగ
వడివడిగా తెలివితోటి
బడిలోపల నేర్వ గాను

ప్రొద్దు పొడిచెనదిగో
ముద్దు తండ్రిలేవర॥



# బాలలం...



తెలుగు దేశ బాలలం
తెలుగు వెలుగుతారలం
తెలుగు తీరులన్ని తెలిసి
మెలగుచుండు వారలం...

తెలుగంటే మాకిష్టం
వెలుగంటే మాకిష్టం
తెలుగులోన వెలుగునింప
వలెనంటే మాకిష్టం...

# జేజేలు...

మాతకు జేజేలు
భారత మాతకు జేజేలు॥

బుద్ధునకు జేజేలు
గౌతమబుద్ధునకు జేజేలు॥

తాతకు జేజేలు
గాంధీతాతకు జేజేలు॥

నెహ్రూకు జేజేలు
చాచా నెహ్రూకు జేజేలు॥

# చాచా నెహ్రూ



చాచా నెహ్రూ జేజేలు
శాంతి దూతా జేజేలు ...

నీవు పుట్టిన పుణ్యదినం
నిఖిల బాలల పర్వదినం.

భారత భువిలో పుట్టావు ...
'బార్-ఎట్-లా' చేపట్టావు ...

స్వతంత్రతకై పోరావు
చక్కంగ దానిని తెచ్చావు.

భారత నేతవు అయినావు
పాలన చక్కగ చేశావు

దేశాలను తిరిగొచ్చావు
దేశానికి ఖ్యాతి తెచ్చావు

ఘనుడని కీర్తిని పొందావు
జనులా నివాళులందావు

నీ ఎదలో విరిసెను శాంతి
నీ పెదవిని కురిసెను కాంతి

అందరమీ భువినిసతతము
అర్పింతుమువందన శతము....

భారత నేతా జేజేలు
బాలల ప్రియతమ జేజేలు॥





# చిట్టి పాటలు

## పాటలు-ఆటలు

అల్లరి చిల్లరి పాటలు
ఆనందానికి తోటలు
అల్లి బిల్లి ఆటలు
ఆరోగ్యానికి బాటలు...

## మల్లెల తోటలు...

పిల్లల ఆటలు
అల్లరి పాటలు
ఎల్లరి కెప్పుడు
మల్లెల తోటలు

## కన్ను-పొన్ను

అనగనగా ఓతాత
తాతకు కర్రొక ఊత
ఊత కర్రకో పొన్ను
పొన్నే తాతకు కన్ను

## కిర్రు-తుర్రు

కొత్త చెప్పులజోడు
'కిర్రు' మన్నది చూడు
కూర్చున్న గిజిగాడు
'తుర్రు' మన్నది చూడు...

విమానం...

ఆకాశంలో విమానం
అందరి కది సుఖయానం
పెట్రోలే దానికి పానం
'ఖర్..ఖర్' మని చేయును గానం

గొడుగు...

పాలవెల్లీ రీతి
మూలనుండే గొడుగు
వానకూ ఎండకూ
మనిషికెప్పుడు తోడుగు.

పావురాయి...

పావురాయి పావురాయి
పైకిపైకి ఎగురునోయి
పరికించగ ఎంతోహాయి
ప్రతివారికి చూపునోయి...

కాకిపిల్ల...

కాకిపిల్ల...కాకిపిల్ల
కారు నలుపు కాకిపిల్ల
'కా...కా' యని నేనంటే
"కా...కా" యని పలుకు పిల్ల.

పంది పిల్ల - కందిపుల్ల

మురికినీటి లోనదొర్లు
సరదాగా 'పందిపిల్ల'
చెరువు నీటిలోన తేలు
విరిసివేయ 'కందిపుల్ల'

గోడమీద బల్లి.

గోడమీద బల్లి
ఊడిపడును చెల్లి
పడకు పడకు త్రుళ్ళి
గోడ కెక్కుమళ్ళి...

తేలు...

కట్టె క్రింద తేలు
ముట్టెనమ్మ కాలు
కుట్టుకుంది చాలు
ఇట్టె జరిగె మేలు...

కోతి - మూతి:

చెట్టుమీది కోతి
ఇట్టె ముడిచె మూతి
చుప్పనాతి రీతి
చూడు పాడు కోతి..

సాలెగూడు...

చకచక తిరుగుచు సాలీడు
చక్కగ అల్లును ఒక గూడు
పట్టు లాగ అది మెరిసేను
పూచిన పూవై విరిసేను...

తామర:

ప్రతి చెరువులోన పెరుగు
"బురద" నుండి తామర
తాత వీపుమీద పెరుగు
"దురద" పుట్టు తామర.

బోడి గుండు:

తాత బోడి గుండు
తాటి చెట్టు పండు
తీరు గుండు నండి
మీరు చూడరండి

బొమ్మ - కమ్మ:

ఉంది నాకు బొమ్మ
అందమైన బొమ్మ
బొమ్మ ముక్కు కమ్మ
'కమ్మ' ఉంది లెమ్మ.

పండు:

దోర దోర పండు
దొరకిన బాగుండు
తీయతీయ గుండు
తినగ కడుపు నిండు.

నీడలు:

నిన్ను అంటి ఉండును
నన్ను అంటి ఉండును
వెలుగులోన నీడలు
వెనుక వచ్చు జాడలు.

అగ్గిపుల్ల:

అగ్గిపుల్ల చిన్నది
అగ్ని నిచ్చుచున్నది
గీయగానె మండును
గదిలొ కాంతి నిండును.

మిరపకాయ:

మిరపకాయ మిరపకాయ
కారమిచ్చు మిరపకాయ
కొరికి చూడ 'చుర్రు' మనుచు
నోరు మండు మిరపకాయ.

## అమ్మ పాలు:

అమ్మ పాలు ఆవు పాలు
కమ్మగుండు గుమ్మపాలు
ఆకలైన వారికెపుడు
ఆహారం మంచి పాలు...

## ఎరుపు:

సింధూరం ఎరుపు
మందారం ఎరుపు
శక్తిని మన కిచ్చే
రక్తం అతి ఎరుపు

## గువ్వ:

కొమ్మమీది గువ్వ
'కువకువ' మని నవ్వ
రాయితీసి రువ్వ
మాయమాయె నవ్వ...

## కప్ప పాఠము:

"బెకబెక" లాడుచు కప్ప
చకచక పాఠము చెప్ప
వినగా వీనుల విందు
వినుడూ మీరికముందు

ఆట - పాట:

నలుగురు కలసిన చోట
నాలుగు స్థంభాలాట
కలతలు మరచిన పూట
కిలకిల నవ్వుల పాట...

తెలుగు భూమి:

తెలుగుభూమి పసిడి భూమి
పాడిపంటలున్న భూమి
శాంతి సిరులతో ఎప్పుడు
నిండి వెలుగుచుండు భూమి...

తెలుగువారు:

తెలుగువారు వెలుగువారు
తెలివితేట లున్నవారు
పలువురితో ఎల్లప్పుడు
కలసి మెలసి తిరుగువారు...

తెలుగు తేజం:

తెలుగు తేజమన్నది
తేజరిల్లుచున్నది
తెలుగు చరిత ఉన్నది
వెలుగు వెలుగుచున్నది...

పిచ్చిక గూడు!

చిన్న దొకన్న పిచ్చిక
చేర్చి కొంత పచ్చిక
కట్టుకుంది గూడు
చెట్టుమీద చూడు...

చెరువులో బాతు!

చెరువు చాల లోతు
చెరువులోన బాతు
గాలి పడగలాగ
తేలివెళ్ళు వేగ...

ఎద్దు - మొద్దు!

బండిని లాగే ఎద్దు
ఎండకు వానకు మొద్దు
పాపము దానికి హద్దు
పని ఎపుడుండగ వద్దు...

అందం !

అందం - ఆనందం
బంధం - అనుబంధం
దేశం - ఆదేశం
రాగం - అనురాగం...

## మంచిదనం ...



బాపుమాట తీయదనం
బోసినవ్వు చల్లదనం
ఖాదిబట్ట తెల్లదనం
మన కిచ్చును "మంచిదనం"...



1

పంచవన్నె లున్న పక్షి
పలుకు నేర్చి నట్టి పక్షి
అందరికీ ముద్దొచ్చే
అందమైన దా పక్షి

2

ఆకాశంలో పక్షి
హాయిగ ఎగిరే పక్షి
అందమైన పక్షి
'ఆయిల్' తినే పక్షి

3

నొక్కునొక్కుల బిళ్ళ
ఉక్కులాంటి బిళ్ళ
నరులందరి చెంత
నలుగుచుండే బిళ్ళ

4

మణికట్టు పైనుండు
మరి గాజులా ? కాదు
ప్రొద్దుతో అది ఎపుడు
పరుగెత్తుతుంటుంది...

5

అన్ని జీవులకుండు
అటు ఒకటి ఇటు ఒకటి
ఆ రెండు లేకుంటె
అంతా ఇక చీకటి...

6

తోక లుండవుగాని
దిక్కులెన్నియొ తిరుగు
అచ్చట్లు ముచ్చట్లు
అన్ని చోట్లను చెప్పు...

7

మీటలెన్నియొ ఉండు
పెట్టె మాదిరి ఉండు
మీట త్రిప్పిన వచ్చు
మాటలూ .... పాటలూ ...

8

ప్రతి ఊరిలో నుండు
లోతు గానివి కొన్ని
అచటినుండియె నీరు
మోసుకొని వస్తారు...

9

అందనీ గగనాన
అందాల నొలికించు
అందరికి హాయినీ
అది ఎపుడు కలిగించు...

10

అటు మాట లిటువైపు
ఇటు మాట లటువైపు
అనినంత వినిపించు
ఆనందమనిపించు...

11

నోటి దగ్గరనుండి
మాటలాడిన వెల్ల
తీగలో ప్రవహించు
దూరాన వినిపించు...

12

అంతం లేనిది
అనంతమైనది
అననికి షైగా
ఆవరించినది ... ఏమిటి ?

13

ఆకారాన్ని అది
అందంగా చూపుతుంది
అందరికీ ఎపుడు
అందుబాటులో ఉంటుంది...

14

నోటిలోన వాసముండు
నరమన్నది లేకయుండు
కత్తికన్న వాడిగుండు
అది ఏమిటో చెప్పరండు.

---

విడుపులు...

1. రామచిలుక 2. విమానం 3. రూపాయి
4. గడియారం 5. కళ్ళు 6. ఉత్తరాలు
7. రేడియో 8. బావులు 9. చందమామ
10. టెలిఫోను 11. మైక్రోఫోను 12. ఆకాశం
13. అద్దం 14. నాలుక.

# మంచి బొమ్మ



నాన్న తెచ్చెనమ్మ
నాకు మంచి బొమ్మ...

అందాలను చిమ్మ
అతి చక్కని బొమ్మ.

ముద్దులొలుకు బొమ్మ
ముద్దులిచ్చు బొమ్మ
బొమ్మతోటి నేను
బాగ ఆడుతాను...

# చిన్నారి-పొన్నారి

చిన్నారి పొన్నారి
చిట్టిపాపల్లు
కన్నుల్లో మెరిసేటి
కంటి పాపల్లు
పరువాన ఆడేటి
పండు గువ్వల్లు
ప్రతి ఇంట మోగేటి
పసిడి మువ్వల్లు॥

ప్రాస పాట

తిన్నారా తిండిని మీరు
కొన్నారా బండిని మీరు

అన్నారా మాటలు మీరు
విన్నారా పాటలు మీరు

తన్నారా బంతిని మీరు
కన్నారా వింతను మీరు...

## పడవ ఆట :



చిటపట భువిపై
చినుకులు పడితే
బడికి సెలవులే
మా బాలలకూ...

మాపుల వెంబడి
ధారలు కారీ
చక చకపారే
చిన్ని కాల్వలో...

పడవలు చేసీ
పదమని వదలీ
చక్కని ఆటలు
చిన్నారులకూ...

## గోరుముద్ద...

గోరుగోరు ముద్ద
గోరంత ముద్ద
గుజ్జు గుజ్జు ముద్ద
గోజ్జంగి ముద్ద

అమ్మ పెట్టుముద్ద
కమ్మ నైనముద్ద
కోరి కోరి పాప
ఆరగించు ముద్ద...

## కావాలి...

గింజకు మొలక
మొలకకు పిలక
పాపకు గిలక
నాకొక పలక
కావాలి! కావాలి!!

పాపకు అమ్మ
చెట్టుకు కొమ్మ
కొమ్మకు రెమ్మ
నాకొక బొమ్మ
కావాలి! కావాలి!!

## పాము ఆట!

పుట్టలోని పాము
బుట్టలో కొచ్చింది
బుట్ట మూతను తీయ
పడగెత్తి లేచింది.

నాగస్వరమును తెచ్చి
ఆగకుండా ఊద
పడగనెత్తి గాలి
పడగలా ఆడింది...

పాము పడగను చూడ
పాప లందరు కూడి
ఆట ఆడే పాము
ఆటల్లు చూశారు...

పాము రూపము చూడ
భయమేను అందరికి
పాము ఆటను చూడ
మోదమే అందరికి...

## అందాల మామయ్య!

అందాల మామయ్య
చంద మామయ్య
అందనీ ఓ అయ్య
అంది రావయ్య!!

చుక్కల్లో రాజులా
చిక్క ఉన్నావు
దిక్కులన్నీ నిండి
చక్కగున్నావు..

మల్లెపూవులమించు
తెల్లన్నివాడ
చల్లనీ వెన్నెలలు
చల్లేటి ఱేడ...

అందరికి హాయినీ
అందించవయ్యా
అందాల నెలఱేడ
అంది రావయ్య!!

# సూర్యుడు



తూర్పున పొడిచే సూర్యుడు
తొలిగా వచ్చును సూర్యుడు
మెల్లగ పెరుగును సూర్యుడు
తెల్లని వెలుగుల సూర్యుడు
పగలే ఉండును సూర్యుడు
భగ్గున మండును సూర్యుడు
ఆకాశంలో సూర్యుడు
ఆపక తిరుగును సూర్యుడు

పడమర ఎప్పుడు సూర్యుడు
బడబడ మునుగును సూర్యుడు...

## నా నడత

మంచి పనులు నేను జేయ
'మంచివాడి' నని అందురు
అల్లరేమొ నేను జేయ
'అల్లరి వెధవ'ని అందురు...

మంచి ఆటలేను ఆడ
ముచ్చటగా చూస్తారూ
మట్టిలోన ఆడుచున్న
'మడ్డి వెధవ'ని అందురూ...

అందరి మాట వింటేనే
'ఆహా!' మంచివాడందురు
మాటలసలు వినకుంటే
పోకిరివాడనందురు...

పనులన్నీ బాగ చేయ
'భలే! భలే!' వాడందురు
తిరిగి నేను మొండికేయ
తిట్టుతెన్నొతిట్టెదరూ...

అందుకనే నేనిప్పుడు
మంచిఆటలాడుచుంటి
అందరి మన్ననలు పొంద
అణకువనే నేర్చుకొంటి...



## పూవులు...

చిన్న చిన్న పూవులు
వన్నెలున్న పూవులు
వన్నె చిన్నెల తోడ
ఎన్నరాని పూవులు...

అందమున్న పూవులు
చందమున్న పూవులు
అందచందాలతో ఆ
నంద మొసగు పూవులు

# రంగుల రాట్నం

రాట్నం...రాట్నం
రంగుల రాట్నం
గిర గిర ఖిర ఖిర
తిరిగే రాట్నం...

పిరికున్న అబ్బాయి
రాట్న మెక్కంగా
కళ్ళు తిరిగీ తాను
కలవరాపడ్డాడు...

ధైర్యంతో అబ్బాయి
రాట్న మెక్కంగా
గిరగిరా తిరిగితా
సంబరా పడ్డాడు

రాట్నమెక్కారమ్మ
రంగులరాట్న మెక్కరే
గిరగిరా తిరిగేటి
చక్కని రాట్నమెక్కరే॥

# బుగ్గలు-మొగ్గలు

మొగ్గలు మొగ్గలు
విచ్చని మొగ్గలు
చిరు చిరు మొగ్గలు
అందరికందం
చూపెడు మొగ్గలు...

బుగ్గలు...బుగ్గలు
ఎర్రని బుగ్గలు
మనసు నిండుగా
మధువులు నింపెడు
పాపల బుగ్గలు
చిరుపాల బుగ్గలు...

ముట్టుకుంటె వాడిపోవు
ముచ్చటైన మొగ్గలు
పట్టుకుంటె కందిపోవు
పసందైన బుగ్గలు...

బుగ్గలు-మొగ్గలు
మొగ్గలు-బుగ్గలు
చిరుచిరు మొగ్గలు
చిన్నారి బుగ్గలు...

# అందాల బాల

చదువు కొని వచ్చింది
చక్కన్ని బాల
తాయిలమ్మైదైన
తీసుకొని రండు

ఆడు కొని వచ్చింది
అందాల బాల
ఆప్యాలా గ్లాసు
అందించరండి.

పాట పాడి వచ్చె
పరువాల బాల
పండ్లు ఫలాలనూ
పుచ్చు కొనిరండి

బుద్ధిగా ఉంటుంది
ముద్దుల బాల
ప్రతివారు ఇస్తారు
ముద్దులు చాలా ■

## చిన్నారి పాప ...

పాపాయి పాపాయి
మా మంచి పాపాయి
పండు వెన్నెల లాంటి
పరువాల పాపాయి॥

పాపాయి కన్నుల్లు
పగడాల పువ్వుల్లు
మా పాప బుగ్గల్లు
మరుమల్లె మొగ్గల్లు



తెల్లనీ జాబిల్లి
    వెలుగుల్లు కురిపించ
మా పాప చిరునగవు
    మణులెన్నొ కురిపించు

కనులలో కాంతులా
    కళలెన్నొ చిలికించు
నోటిలో రత్నాల
    గుట్టలే ఒలికించు

అందరిని మురిపించు
    ఆనందం కలిగించు
అఖిల జగతిని మించు
    అందాలు చూపించు



# మూడు మాటలు



బద్ధకమ్ము తోటి నీవు
మొద్దువలె మెలగకుండ
ఒద్దికగా బడికి పోయి
బుద్ధి కలిగి మెలగు బాల

గురువు మాట మీరకెపుడు
గరువ ముడిగి మెలగ వలయు
చెప్పునట్టి పాఠాలను
తప్పకుండ చదువ వలయు

పరుల తోటి ఎన్నడైన
పరుష భాషలాడరాదు
పరులనెపుడు నిన్ను వలె
పరికించుట మరువరాదు ...